శ్రీ

# గోదావరి పుష్కర మహాత్మ్యము.

ఇది

భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారిచే రచియింపబడియె.

బాపట్ల, గుంటూరుజిల్లా.

వెల 0—2—0 మాత్రమే.

కావలసినవారు :—

డాక్టరు బి. యస్. ప్రకాశరావుగారికి,
స్వదేశీ హాస్పటల్, బాపట్ల, గుంటూరుజిల్లా.

---

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు బి. కే. స్వామిచే
ముద్రింపబడియెను.
1920.

# విజ్ఞాపన.

నా జీవితమున నేను పెక్కు గ్రంథముల రచింపవలెనని బహు కుతూహలమును జెందితినిగాని, దైవకృప లేక నావకాశము చిక్కలేదు. ఈ గోదావరీ పుష్కరమహాత్మ్యమను చిన్న గ్రంథమును వ్రాయవలెనని యే నెన్నడుం దలంచియుండలేదు. గాని నా మిత్రు లనేకులు గోదావరీ పుష్కరసమయము వచ్చుచుం మిక్కిలి యవసరంబనియు, ఆ కథను పద్యరూపముగను క్లుప్తముగను వివరించవలెనని కోరిరి. మన గోదావరీ యము, మహానీయుండగు గౌతమ మహాబుషుండు తపోనిష్టాగరిష్ఠుండై యనేకనిష్ఠలను ఘోరతపం బాచరించుచుండ ఇతర మహామునిగణంబంతయు నోర్వంజాలక పెక్కుయుక్తులంబన్ని అందోరుచు కృతార్థులు గాకుంటుట బట్టి, తమతమ తపోమాయలచే విచిత్రమగు నొక్క గోవును సృష్టించి గౌతమునిచే మంత్రమహాత్మ్యంబున నాటి, ఫలింపబడి యెదుగుచున్న సస్యముల, నాశనము జేయ నియమించుతరి ఆమహానీయుం

డు ఆకృత్యము చు గనుంగొనలేక ఆ మాయాగోవుపై ఆగ్రహచిత్తుండై
మ తిరించినఒక కుశాంకురంబును పశువై చెనియు, దానివల్ల ఆ గోహ
త్యాపాపము గట్టుకొనెనియు, అందువలన తపోభంగమయ్యెననియు,
తద్ పాపమునుండి విముక్తిం గాంచుటకు తన ప్రియురాలగు గంగకు
అనుజ్ఞనిచ్చి ఒక్క పాదు జలంబు విచ్చుటకు శంకరునికై ఘోరతపం
బాచరించినట్లును, అందువలన గంగామహాతల్లి పతియాజ్ఞమీరక తన
లోనుండి ఆ మహాఋషి పాపవిమోచనంబునకు పాయను పోనిచ్చెనని
యు, ఇప్పుడు కొవ్వూరుగా బరగుచున్న గ్రామమునందు గోపాపము పోగొ
ట్టుకొనిన ప్రదేశంబగుటచే గోపురమని పూర్వులచే నడబడిన పేరు
నంటకలిపి కొవ్వూరని అర్థములేని పేరుపెట్టిరనియు, అదిగాక ఆ పాప
మును పోగొట్టుకొనుటకు కోటిలింగముల స్థాపించి పూజయొనర్పను
శముచే కోటిలింగములను వారణాసినుండి తెచ్చి రాజ్మహేంద్రపురీర

మునందు రామలింగేశ్వరునితో సహా ప్రతిష్ఠించెననియు, అట్టి మహా ప్రదేశములో హిందూదేశమునంగల జీవనదులెల్ల తిరగి స్నానమాచరించుచువచ్చెడి బుధునిమంత్రియగు పుష్కరుడు దేవగణంబులతో నవమి దినంబునందు ప్రవేశించుననియు, గాన మహానీయుడగు ఆ పుష్కరుడు ప్రవేశకాలము మొదలు పండ్రెండు దినంబులు ముఖ్యమైనవిగాన వాటినే పుష్కరకాలమనియు. అట్టియెడల దేవ, కిన్నర, గంధర్వ, కింపురుష మహాగణంబులతోటిపాటు మానవకోటిగూడ స్నానమాచరించి పిండప్రదానంబులు గావించిరేని గతించినవారును నున్నవారును ఇహపరసౌఖ్యముల గల్గెడివారై మోక్షమును జెందుదురనియు ఈ సంగతులు లెల్లరకును దెలిసినవేయైననూ ఆ సంగతులను సూచించుచు నేను బహు ఇమిడికలో ఈ చిన్నగ్రంథమును రచించి దైవమును నమ్మినా ప్రియమిత్రుడు, దేశభక్తుడు, రాజకీయవ్యవహారత గుంటూరుజిల్లా

కోర్టులో బారిష్టరువదవినొందియున్న హైకోర్టు యాడ్వొకేటయు, లెజిస్లేటివ్ కవున్సిల్ మెంబరుకు సర్వవిధముల తగియుండి, దేశాభివృద్ధికై ప్రయత్నించుచున్న మ॥ రా॥ రా॥ శ్రీ పంగులూరి శేషాతలపశాయి పంతులుగారికి నా మనఃపూర్వకమగు వాదనములతో దీనిని ఆయనకు అంకితమునిచ్చి అర్పణచేయుచున్నాను. గాన దేవుడు ఆయునకు సర్వదా తోడ్పడియుండుగాత. చదువరులు నా తప్పులను క్షమించెదరు గాక.

ఇట్లు విన్నవించు విధేయుడు,

భ॥ సూర్య ప్ర కా శ రా వు.

ఉ॥ నా కవితంబు నాకృతియు నాదగు మిత్రుడు పంగులూరి వం
శాకలవార్ధిచంద్రుడయి శేషువిపేరగు తల్పశాయికే
ప్రాకటమొప్ప యంకిత మపారముగా వెలుగొందునట్లు నే
నాకరిబ్రోచినట్టి పరమాత్ముని వేడెద నామనంబునన్ ।

* శ్రీ విఘ్నేశ్వరప్రార్థన *—

ఉ. శ్రీగణనాథ సేవిత విశేష మరుత్ప్రముఖాళినాథపూ
జాగణ నాథ భక్తజన సన్నుత దీరసనాథ దివ్యస
ద్వాగమృతాధి సాధమన పాపవిభంజన విఘ్ననాథ నీ
న్నేగణియింతు సత్కృతియు నిందితమై ధరలో వెలుగంగన్ 1.

* సరస్వతీప్రార్థన *—

మ. నిరతంబున్ నిను సంస్తుతింతును భవన్నిర్మాతృ కోద్దండదు
స్తర నైర్మల్యకృపా కటాక్ష కవితస్వాంత బునుంబూని భం
భరవేణీ కలవాణి వాణి విలసత్ వాణీ ననున్ వేగసత్
కరుణన్ బ్రోచి మరియు పుస్తకముఖన్ కాపాడవే భారతీ ॥ 2.

* శ్రీ రామలింగేశ్వరప్రార్థన *—

మ. అణువై యద్భుతమై భయంకరమునై యానందసంధానమై

గణనాతీతమునై దుర్గోచరమునై కళ్యాణకంబై నిరం
జనమై నిశ్చలమై విమర్మలమునై సర్వాత్మవౌనీదు పావనరూపంబును
నామదిఁ దలతు దేవా రామలింగేశ్వరా ॥ 3.

మ. అతికష్టాత్మకముల్ నిరంతరభయప్రారంభముల్ హేయముల్
సతతాయాస విచార హేతుకముల లాశ ఛన్న కూపంబులు
గ్రతరాపతకరముల్ దురంతములు ఘోరంబులౌ భవద్ భక్తిని
ర్జితసంసారసముద్రముల్ విమలమూర్తీ రామలింగేశ్వరా ॥ 4.

* సోమలమ్మాదేవిప్రార్థన *—

శా. తల్లీసద్గుణవల్లీ కీర్తియుతసౌద్యద్వల్లీ సౌందర్య సం
పుల్లాబ్జాక్షి ప్రమత్త దంతిగమనా ప్రోత్తుంగి కూభస్తని
సల్లావణ్యాశీవపుష్ప నవభాస్వల్ పేశలాంగీ సదా
యుల్లంబందున నిన్ను నెంతుమనుమీ యోసోమలమ్మాకృపన్ ॥ 5.

## కథా ప్రారంభః

సీ. రంగదభంగతరంగ సముత్తుంగ
గంగామహానదిఁ గనినరీతి
దేవతాపూజ్యాబ్ధి దేవేరియై యొప్పు
కావేరినదిని దాఁగనినభాతి
ప్రాబల్యనైర్మల్య ప్రస్తుతామూల్య
ప్రఖ్యాతనర్మదనదిఁ గనిన లీల
బ్రహ్మపుత్రానదిని ప్రణుత మహానదీ
ఘనకృష్ణవేణులఁ గనిన విధము

గీ. నుల్లసంబున ప్రజలు రంజిల్లుచుండ
ప్రబలకీర్తి సమేత శ్రీ భరత మాత

యతుల గోదావరీ నదీహర్షమునను
గోర్కులీడేర నిట్టి గనుగొనియెగాదె ॥

చ. నవమి దినంబునందునను నాసికపర్వతసీమయందు నా
దివసకరుండు పశ్చిమపుదిక్కున గ్రుంకెడి వేళయందు స్వా
రవన మరాళకీరళికరాళములుత్సుకమందు చుండ నం
భవమును జెందితీవు సరివారు గలారె తలంచి నీకిలన్ ॥

ఉ. నీవిభవంబు నీఘనత నీసిరి నీసుమహాత్మ్య సంపదల్
నీవిమలస్వభావమును నీపరిపూర్ణ యశోవిలాసముల్
నీ విపరీతధర్మము గణింప దరంబె యవారికైన గో
దావరి ధరాస్థలి యథార్థము నీసరిలేరు లేరికన్ ॥

చ. పెరిగితికొన్నిరోజు లభివృద్ధికి వచ్చెదు దాక నాశికన్
నరసముయూర హంస విలసన్నవపుష్ప పరీతభూములన్

సురవిసిక్త సీకర విశుభ్రఘనాళి లయుక్త కాసారల్
సరసిజ సద్దళత్ కుముదచారు లతాంత సరోవరంబులన్ ॥

క. అంతట దయతో దుత దే
శాంతరముల కరుగదలచి యలఘుజనమునన్
సంతసమున విబుధులుని
న్నెంతో కొనియాడ పయన మీవైతివిగా ॥

సీ. పడమటికనుమల జలుమల్లోగాని
పునుగు జవ్వాజులన్ బొందిబొంది
మహారాష్ట్రదేశంబు మానితంబును జేసి
వనపుష్పసురభులం బడసిబడసి
నైజాము దేశపు భూజనంబులగాంచి
దేశాభివృద్ధికై తివిరితివిరి

ఘోరకాంతారముల్ క్రమ్మరి క్రమ్మరి
కోయదేశములకు పోయిపోయి
గీ. ఆంధ్రదేశంబునందున సుగుణనిధుడు
తజ్జనంబులకుఁ బ్రమోదములఁ గూర్చి
చేరగలిగితి తుద కతిశ్రీఘ్రగతిన
హీనసౌఖ్యకరరాజమహేంద్రనగరి ||
సీ. మాణిక్యగాణిక్య హర్మ్యము లొకచోట
నుత్తుంగసౌధము లొక్కచోట
ఉన్నతమదకరేంద్రోష్ట్రము లొకచాయ
నుద్దీపితానగరు లొక్కచాయ
ఉద్యానవనపు విద్యుద్ద్యోతి యొకవంక
నభ్యనుపమానము లొక్కవంక

పునుగుజవ్వాజి కాంచనచయ మొక్కప్రక్క
నుద్యద్విపణితతి యొక్కవంక

ఆ॥ వె. శుకమయూరహంసపికసంఘ మొకచక్కి
పెక్కువస్తుబృంద మొక్కతీరు.
గలిగి కౌముదీ ప్రకాశంబునను రాణ్మహేంద్ర
నగర మొప్పు నిలను గరము ॥

సీ. రాజనరేంద్రుడు రాజ్యమేలిన చోటు
సారంగధరుడు మూర్ఛ జనినచోటు
యాదిభారతకవి యవతరించినచోటు
మహనీయుడు సుబుద్ధి మన్నచోట
విష్ణువర్ధనరాజు విజయమొందినచోటు
రత్నాంగిదేవి బరగినచోటు

వీరేశలింగము విరతిగాంచినచోటు
ఆంధ్రభాషకు నెలవైనచోటు ॥

గీ. చిలకమర్తి లక్ష్మీనరసింహ సుకవి
సుబ్బరాయాది కవులచే శోభగాంచి
యతుల విఖ్యాతశోభిల్లు నట్టిచోటు
ఈ ప్రకాశిత రాజమహేంద్రవరము ॥

గీ. సస్యములభివృద్ధిజేయంగ సాధనమున
అంగిలేయులుకట్టిరి యానకట్ట
అద్భుతంబగు వారధి నమరజేసి
కూర్చినారే గోదావరీ గొప్పనికు ॥

గీ, నిన్ను ప్రేమించి సప్తర్షులెన్న మిగుల
ముదముతోడుత జలము దీముదలగాంచి

కం. ఈపుణ్యకాలమందున
శ్రీపారగ దేవమును లహీనమహాత్మ్యల్
దాపునకరుదెంతురు నీ ప్రాపును
బడయంగగోరి రయమున నెపుడున్ ॥

సీ. నిన్ను సేవింపంగ నీకుహారగతులేయా
ముత్తైదులందెంత్రు మోదమునను
పిండప్రదానముల్ పెంపుగా జేయంగ
బ్రాహ్మణసంఘముల్ వత్తురిపుడు
నీతీర్థములవారు నెమ్మి సేవింపంగ
దంపతుల్ వత్తు రందంబుగాను
మంత్రముల్ పఠియించి మాన్యంబులొందంగ
పురహితు లిత్తరి నరుగుదెంత్రు ॥

గీ. సర్వజనసంఘములు సన్నుతించి
నిన్ను సేవింపవత్తురు నిక్కముగను
ఆహా ఏమందు నీమహాత్మ్యాదిశయము
సరసమహిత గోదావరీ జనని వినుము ॥

గీ. కాశికింబోయి జలము లాకాశగంగ
తెచ్చినీలోనగలిపి నీతీర్థమెలమి
నింటికిఁ గొనిపోయి పూజింతురహహ
నీమహాత్మ్య వైభవము వర్ణింప దరమె ॥

క. ఈతరుణమందు కొందరు
చేతంబున ద్రోహమూని సిగ్గును లేకే
రోతలగు పనుల జేయగ
నేతెంతురు బుధులమంచు నెంచిమనముల౯ ॥

సీ. కాంతల మానభంగము సేయు వారలు
దొంగతనంబుకై తొడరువారు
బూతులకూయుంగ బూనెడి వారలు
కామించువారిని గాంచువారు
దెబ్బలాటలనాడ దెవిరెడి వారలు
విధవల జూడంగ వెతకువారు
కపట సన్యాసంబు గలిపించుకొను వార
లపహరించినవెల్ల నమ్మువారు
గీ. జూదముల బెల్లుగానాడ జూచువారు
నితరులను మోసబుచ్చంగ నెంచువారు
జేరుదురు నీమహాత్యంబువలన వారినెల్ల
నణగద్రొక్కవె యోతల్లి యతులశక్తి ॥

సీ. బ్రహ్మముడులతోడ పరతెంచువారలు
కౌపీనములతోడ గ్రాలువారు
అలలపైనలలు నుయ్యాలలూగుచును రాగ
ఎదురేగు మను నీద నెంచువారు
బిచ్చంబులడుగుచు ప్రేలెడివారలు
పలుమంత్రముల నెన్ని పాడువారు
పులిహోగిరంబులు భుజియించువారలు
వొడ్డగా నీటిలో దుముకువారు

గీ. భజన సల్పెడివారలు పాడువారు
తీర్థమాడు స్త్రీలనుగాంచి దిరుగువారు
పుణ్యమునుబొంద నిష్ఠతో మునుగువారు
వత్తురిత్తరి సీమహాత్మ్యంబువలన ॥

గీ. అనుదినంబును ప్రొద్దుట నఖిలజనము
ముక్తిగాంచగ దలచుచు మోదమునను
వచ్చితీర్థమాడుదురు ప్రవాహమునను
వినుటంచును నిన్ను సేవించువాడ॥

శా॥ తల్లీ నీదుమహాత్మ్యసంపదను సాధ్యంబౌనె వర్ణింప గం
జిల్లన్ బూర్వసువాసినీజనులు వీక్షింపంగ చిత్రంబుగా
ఫుల్లాబ్జానలు వేసవేలుయువకుల్ భూదేవతల్ పెక్కుర
త్యుల్లాసంబున నీకు సేవసలుపన్ గోక్షేత్రతు గోదావరీ॥

ఉ॥ నాటకమాడువారులలనామణులన్ గను బ్రాముడువారు జం
జాటముతోడవచ్చితివి చచ్చినభాగనియెంచువార శ్రీ
పాటలగంధిమంచిదని పట్టునసెంచగ పూనువారు మో
మాటమిలేక పౌరులను మోసముచేసెడివారు స్త్రీలకు

నాటలనాడువారు కడుపారభుజించి ప్రియురాలితోడ స
య్యాటలనాడువారు వెలయాండ్రగృహంబులకేగువారు ము
మ్మాటికి నీమహత్వమున మోదమునన్ జనుచెంతు రిత్తరిన్॥

సీ॥ షాపులోనికిబోయి సామాన్సుగొని తన
చేడియన్ శాంతింప జేయునొకడు
బూట్సుహాట్సుధరించి బూటకంబులుపల్కి
పరులయిల్లాండ్రతో బల్కునొకడు
తనయాలి మొరునిజూచియు నవ్వటనుజూచి
వలవచ్చితిమంచు నేడ్చునొకడు
తనప్రియనవ్విన్ గని కోపమునుబూని
మూర్ఖురాలాయంచు మోదునొకడు

గీ॥ తనదు కాంతల నెవ్వారు దాకకుండ
నొక్కచో గాజ్వవతె గాచుచుండు నెన్నివి.
నీమహాత్వంబు నెవరు వర్ణింపగలరు
శ్రీయశస్కర గోదావరీమతల్లి ॥ శరకము

శా॥ ఓ గోదావరి నినుసేవకోరకై యుత్సాహముల్ చేసట్టు
ఈగంధర్వమరున్ని కాయముతివే యోశెంచె నీభక్త
రాగంబూనుచుగాచి సర్వసుఖముల్ రాజిల్లగానిచ్చె౦.
గోగాల్ లేకయె హర్షమిచ్చి కరుణ బ్రోవంగ నెల్లం ॥

గీ॥ ఈవలన సస్యముల్ ఫలించుగాత
ఉప్పు తోడ్పడి జనుల రక్షించుగాత
ఇచటి వైదికజనుల బోషించుగాత
శ్రీయశస్కర గోదావరీమతల్లి॥

గీ॥ భట్టిప్రోలు వంశకలశ వార్ధిచంద్రు
లక్ష్మినరసింహపౌత్రుండు లాలితగుణు
వఙ్మఖాఖ్యుని పుత్రుండు సరసఫణితి
వ్రాసెదీనిని సూర్యప్రకాశరావు ॥

స మా ప్త ము.

శ్రీ శ్రీ శ్రీ

---

ఈ గ్రంథకర్తగారిచే రచింపబడి అచ్చుకు సిద్ధమయియున్నవి.

**శ్రీమాయ** :—అను ఒక నవల. సులభశైలి. ఇానేకరకము లగు స్త్రీపురుషుల ప్రేమజాబులు స్వాభావికముగా నుండునట్లు అమర్చబడినవి. వెల రు 1—0—0.

**మారుమనుము**:—ఇదియు నొకనవల. సులభశైలి. 6—0.

అభినవరుక్మిణీపరిణయము ;—నాటకము. వెల రు 1—

కావలసినవారు ముందుగనే దరఖాస్తులు పంపుకొనుడు.

స్పెక్టరు వి. యస్. ప్రకాశరావుగారికి,

బాపట్ల

జ్యోతిషము లేక ప్రశ్న.

తమ జీవితములోని సర్వహంశములు కనుగొనతలంచినయెడల వారి దస్తూరినిగాని, లేక కుడి ఎడమ హస్తములకు నల్లనిరంగు తెల్లని కాగితముమీద అద్ది బంపినగాని, జాతకమును, వెంటనే వివరముగా వ్రాసి పంపెదము. కోరువారు రు. 0-8-0 పోస్టుబిళ్ళలు యీక్రింద అడ్రసుకు పంపవలెను.

కులము వయస్సునుగూడ వ్రాసి తమకు కావలసిన సంగతి అవునా కాదా యనిగూడ మమ్ము అడుగవచ్చును.

డాక్టరు బి. యస్. ప్రరావు.
బ

